





# శతకాలు

భక్తి,జ్ఞాన,నీతి

# వేమన శతకము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000004646

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ రామా!

# వేమన శతకము

## (టీకా తాత్పర్యములతో)

రచన:- **వేమన**

టీకారచన:- "మూర్తి"

ప్రకాశకులు:

**కొండా శంకరయ్య**

పుస్తకముల వ్యాపారము

మహాకాళివీధి సికింద్రాబాద్.

(బ్రాంచి: వరంగల్)

1952



[వెల రు 0—5—

శ్రీ రా మా !

# వేమన శతకము

## (టీకాతాత్పర్యములతో)

ఆ॥ వె॥ నిక్కమైన మంచి । నీల మొక్కటి చాలు
దళుకు బెళుకురాళ్ళు । తట్టెడేల ?
చాటుపద్య మిలను । చాలదా యొక్కటి ?
విశ్వదాభిరామ ! । వినుర ! వేమ ! 1

టీ॥ విశ్వదాభిరామ = ప్రపంచమును ఆనందింపజేయువాడా, వేమ=వేమనకవీ !, వినుర=వినుము, నిక్కమైన=నిజమైనట్టిది, మంచినీలము=జాతిరత్నము, ఒక్కటి, చాలును=సరిపోవును, తళుకుబెళుకురాళ్ళు=ఆడంబరము గలిగించే ఇమిటేషన్ రాళ్లు, తట్టెడేల=గంపనిండుగా ఉన్నను లాభమువిమి ? (లాభము లేదని భావము) చాటుపద్యము=నవరసములుగల పద్యము ఇలను=ప్రపంచమునకు, చాలదా=పనికిరాదా ! (పనికి వచ్చునని భావము.)

తా॥ లోకమును సంతసపెట్టునట్టి వేమనకవీ ! వినుము. తట్టెడు ఇమిటేషను రాళ్ళకంటె, మంచి విలువగల జాతి రత్నము యొక్కటైనను ఎంతగా ప్రకాశించునో—అట్లే అవినీతిలేనిదై మంచిగుణమును బోధించు పద్యము ఒక్కటైనను ప్రపంచమునకు (జనులకు) ఉపయోగించును.

ఆ॥ వె॥ గంగగోవుపాలు । గంటెడైనను చాలు
కడివెడైన నేల । ఖరముపాలు ?
భక్తి కలుగుకూడు । పట్టెడు చాలురా॥ వి॥ 2

టీ॥ వేమా ! గంగగోవుపాలు = శ్రేష్ఠమగు ఆవుయొక్క క్షీరము, గంటెడైనను=గరిటెడు అయినను, చాలు=సరిపోవును, ఖరము=గాడిద, కడివెడు=కుండనిండుగా, ఐనన్=ఉన్నను, ఏల = ఏమిలాభము, భక్తికలుగు=దయ ఉన్నట్టి, కూడు = అన్నము, పట్టెడు=గుప్పెడు, చాలురా=సరిపోవునుసుమా !

తా॥ వేమనయోగీ! బిందెడు గాడిదపాలకంటె, ఒక గరిటెడు ఆవుపాలు ఎంతశ్రేష్టమో—అదేవిధముగా దయతో పెట్టిన అన్నము ఒకముద్ద అయినను మంచిదని తెలియుము.

ఆ॥ వె॥ మిరియవిత్తుగనిన । మీద నల్లగనుండు
కొఱికిచూడ లోన । చుఱుకుమనును
సజ్జను లగువారి । సార మిట్లుండురా॥ వి॥ 3

టీ॥ వేమా ! మిరియవిత్తు = మిరియపుగింజ, కనినన్= చూడగా, మీద=పైభాగము, చుఱుకు=బాధ, సజ్జనులు=మంచి గుణముగల పురుషులు, సారము=శక్తి, మహిమ, గొప్పదనము, ఇట్లుండురా=ఈ విధముగా ఉండునుసుమా !

తా॥ వేమన్నా ! పైకి నల్లగా కనిపించుచున్నను మిరి యాలు కొఱికి చూచినచో లోన కారము ఉండి బాధ పెట్టును. అదేరీతి పైకి సామాన్యముగా కనిపించెడు మంచి విద్యావంతు లను పలుకరించిన వారియొక్క గొప్పతనము తెలియగలదు.

ఆ॥ వె॥ ఉప్పు కప్పురంబు । ఒక్కపోలిక నుండు
చూడ జూడ రుచుల । జాడ వేఱు,
పురుషులందు పుణ్య । పురుషులు వేరయా॥ వి॥

టీ॥ ఉప్పు=లవణము, కప్పురంబు=కర్పూరము, ఒక్క పోలికనె = ఒకమాదిరిగానే, రుచులజాడ = రుచులయందలి భేదము, పుణ్యపురుషులు=గొప్పశక్తిగలవారు,

తా॥ ఉప్పు, కర్పూరము రూపములో తెల్లగానున్నను, రుచులలో తేడా ఉండును. అదేరీతి పురుషులు అందరును ఒక రీతిగా కనిపించినను వారిలో జ్ఞానవంతులు వేరుగా నుందురు. వారిని స్నేహమువలన తెలిసికొనగలము.

ఆ॥ వె॥ మృగమదమును చూడ । మీద నల్లగనుండు
పరిఢవిల్లు దాని । పరిమళంబు
గురువు లైనవారి । గుణము లీలాగురా॥ వి॥ 5

టీ॥ వేమా ! మృగమదము=కస్తూరి, పరిఢవిల్లున్=ప్రకాశించును, వ్యాపించును, పరిమళము=సువాసన, గురువులు= నీతిని బోధించువారు, ఈలాగురా=ఇదేరీతిసుమా !

తా॥ వేమన్నా ! పైచూపులకు నల్లగానున్నను కస్తూరి, తన సువాసనచే లోకమున ప్రకాశించును. ఈ విధముగానే నీతిని ఉపదేశించుగురువు తన విద్యామహిమవలన అందరిచేతను పూజింపబడును.

ఆ॥ వె॥ చిత్తశుద్ధి గలిగి । చేసిన దానంబు
కొంచెమైన నదియు । కొదువ కాదు;
విత్తనంబు మఱ్ఱి । వృక్షమునకు నెంత ? ॥వి॥

టీ॥ వేమా ! చిత్తశుద్ధి=పరిశుభ్రమగు మనస్సు, కలిగి; దానంబు=ధర్మము, చేసినన్=అచరించిన, కొదువ=తక్కువ, విత్తనంబు=బీజము,

తా॥ వేమన్నా ! సంతోషముగా చేసిన దానము కొంచెము అయినను అది చాల ఉపయోగకరమే అగును. ఎట్లనగా మఱ్ఱి చెట్టు విత్తనము చాలచిన్నది. అయినను అది పెద్ద వృక్షమై ఎంతయో ఉపయోగపడుచున్నదికదా !

ఆ॥ వె॥ గుణయుతునకు మేలు । గోరంత జేసినన్
కొండ యౌను వాని । గుణముచేత;
కొండకొలది మేలు । గుణహీనునకునేల ? ॥వి॥

టీ॥ వేమా ! గోరు + అంత=చాలతక్కువ, మేలు=ఉపకారము, గుణయుతునకున్ = మంచి గుణములు కలవానికి, చేసినన్=సల్పినచో వాని గుణముచేతన్=ఆ మంచి గుణవంతుని వలన, కొండయౌను=ఎక్కువయే అగును, గుణహీనునకున్= మూర్ఖునికి, కొండలకొలది మేలు=చాల ఎక్కువ సహాయము చేసినను, ఏల=ఏమియు లాభములేదు.

తా॥ వేమన్నా ! మంచివానికి సహాయపడిన, వాడు తన బుద్ధిబలమువలన పైకివచ్చును. మూర్ఖునికి ఎంత సహాయము

చేసినను, వాడు తన తెలివితక్కువవలన బాధలు పడుచునే ఉండును.

ఆ॥ వె॥ గంగ పారు నెపుడు। కదలని గతితోడ
ముఱికి వాగు పారు। మ్రోతతోడ;
పెద్దపిన్నతనము। పేరిమి యీలాగు॥ వి॥ 8

టీ॥ వేమా! కదలనిగతితోడన్=ఒకేరీతిగా ఉన్నట్లుగానే, ఎపుడు=ఎల్లప్పుడును, గంగ=జలముతోనిండిన పెద్ద యేఱు, పారున్=ప్రవహించును, ముఱికివాగు=మలినమైన కాలువ, మ్రోతతోడన్=గలగలమను చప్పుడుతో, పారున్=ప్రవహించును, పెద్ద=గొప్పవారియొక్క, పిన్నతనము=తెలివిహీనునియొక్క పేరిమి=తారతమ్యము, తేడా, ఈలాగు=ఈవిధముగనే ఉండును.

తా॥ వేమన్నా! తెలివిగలవారియొక్క మాటలు చలనము లేక ప్రవహించు పెద్దఏరు రీతిగ పనికివచ్చునవిగా ఉండును. తెలివిహీనులమాటలు గలగలమని పాఱుముఱికికాలువ ధ్వని వలె పనికిమాలినవిగ ఉండునుసుమా!

ఆ॥ వె॥ అల్పు డెపుడు పల్కు। నాడంబరముగాను
సజ్జనుండు పల్కు। చల్లగాను;
కంచుమ్రోగినట్లు। కనకంబుమ్రోగునా॥ వి॥ 9

టీ॥ అల్పుడు=తెలివిలేనివాడు, ఆడంబరము=బడాయి, పనికిరానిమాటలు, సజ్జనుండు=మంచి నడతగలవాడు, కంచు=ఒకవిధమగు లోహము, కనకము=బంగారము.

తా॥ వేమన్నా! విద్యలేనివాడు తనకుకూడ తెలియని మాటలు డబడబ వాగును. మంచిగుణముగలవా డట్లుకాక, ఎక్కడ ఎట్లు మాటాడవలయునో అక్కడ చల్లగా తగినట్లు శాంతముగా మాటాడును. విలువలేని కంచుపై కొట్టిన కంగు మని ధ్వని కలుగుచున్నది. బంగారము అట్లు కాదుగదా!

ఆ॥ వె॥ కులములోన నొకడు । గుణవంతు డుండెన
కులము వెలయు వాని । గుణముచేత;
వెలయు వనములోన।మలయజం బున్నట్లు॥ వి॥

టీ॥ వేమా! వనములోనన్ = ఒక గొప్పతోటలో, మలయజంబు=శ్రీగంధపుచెట్టు, ఉన్నట్లు = ఉన్నరీతిగా, కులములోనన్=వంశమునందు, గుణవంతుడు=బుద్ధిమతుడు, ఉండిన= ఉన్నయెడల, వానిగుణముచేత=ఆ బుద్ధిమంతునియొక్క కీర్తి వలన, కులము=ఆ వంశమంతయు, వెలయున్=ప్రకాశించును.

తా॥ వేమన్నా! మంచిగంధపుచెట్టుయొక్క పరిమళము వలన తోట అంతయు సువాసన వ్యాపించినట్లు, ఒక్కగుణవంతుడు పుట్టినను అతడు తనయొక్క వంశమునకు మంచికీర్తిని సంపాదించగలడు.

ఆ॥ వె॥ పూజకన్న నెంచ। బుద్ధినిదానంబు
మాటకన్న నెంచ । మనసు దృఢము
కులముకన్న మిగుల।గుణము ప్రధానంబు ॥వి॥

టీ॥ వేమా! పూజకన్న ౯=పూజలు సల్పుటకంటెను, ఎంచగ౯=తలచగా, బుద్ధి=తెలివి, నిదానంబు=గొప్పది, మాట కన్న ౯=మాట్లాడుటకంటె, మనసు=ఆలోచనాశక్తి, దృఢము= గొప్పది, కులముకన్న ౯=వంశముకంటె, గుణము=యోగ్యత, మిగుల=మిక్కిలి, ప్రధానము=ముఖ్యమైనది.

తా॥ పూజలు సల్పుటకంటె తెలివితేటలుగల్గి ఉండుట మంచిది. పనికిరాని మాటలు పల్కుటకంటె మంచిదానిగురించి ఆలోచించుటమంచిది. ఏకులములో బుట్టినను మంచిగుణములు నేర్చుట మంచిది.

ఆ॥ వె॥ మేడిపండు చూడ । మేలిమి వలెనుండు
పొట్ట విచ్చి చూడ । పురుగు లుండు
పిరికివాని మదిని । బింక మీలాగురా ॥ వి॥ 12

టీ॥ వేమా! మేడిపండు=అత్తిపండు, మేలిమి = బంగారము, మదిని=మనస్సులో, బింకము = ధైర్యము, ఈలాగు= ఈవిధముగా.

తా॥ మేడిపండు చూచుటకు పైకి బంగారువర్ణముతో ఉన్నప్పటికిని, దానిలోపల నన్నియును పురుగులే ఉండును. అదే విధముగా పిరికివాడు పైకి బింకముగా మాటాడినను మనస్సులో మాత్రము పిరికితనమే ఉంచును.

ఆ॥ వె॥ ఎంత చదువు చదివి । ఏ సీతి విన్నను
హీను డవగుణంబు । మానలేడు;
బొగ్గు పాలగడువ । పోవునా మలినంబు॥ వి॥

టీ॥ హీనుడు=మూర్ఖుడు, అవగుణంబు = చెడ్డగుణము, మలినము=మురికి.

తా॥ వేమన్నా! బొగ్గునుదెచ్చి పాలతో కడిగినను దాని నలుపురంగు పోనట్లుగా, మూర్ఖునకు ఎన్నినీతులు వినిపించినను తన చెడ్డపనులను మానుకోలేడు.

ఆ॥ వె॥ హీను డెన్ని విద్య । లిలను నేర్చినగాని
ఘనుడు కాడు । హీన జనుడె గాని,
పరిమళములుమోయ । ఖరము గజంబౌనె ? ॥వి॥

టీ॥ వేమా! ఇలను=ప్రపంచములో, ఘనుడు = గొప్ప వాడు, హీనజనుడు=బుద్ధిలేనివాడు, ఖరము=గాడిద, గజము= ఏనుగు, పరిమళములు= సువాసన ద్రవ్యములు.

తా॥ వేమన్నా! సువాసనతోకూడిన పదార్థములను మోసి నంత మాత్రమున గాడిద, ఏనుగు కానట్లుగనే, తెలివిహీనుడు ఎన్నివిద్యలు నేర్చినను గొప్పవాడు కాజాలడు.

ఆ॥ వె॥ వేరుపురుగుచేరి । వృక్షంబు చెఱచును
చీడ పురుగు చేరి । చెట్టు జెఱచు
కుత్సితుండు చేరి । గుణవంతు జెఱచురా॥ వి॥

టీ॥ వేరుపురుగు=వ్రేళ్ళయందు జనించుపురుగు, చేరి= ప్రవేశించి, చెఱచును=నశింపజేయును, చీడపురుగు = ఆకుల యందు పుట్టు పు గు, కుత్సితుండు=అసూయగలవాడు, గుణ వంతుడు=బుద్ధిమంతుడు.

తా॥ వేమన్నా! వ్రేళ్ళయందుపుట్టు పురుగు పెద్ద పెద్ద చెట్లను పాడుచేయును. అకుపురుగులు పాదులు మొదలగుచిన్న చెట్లను పాడుచేయును. దుష్టగుణములు గల అసూయాపరుడు మంచిగుణములు గల్గ బుద్ధిమంతుని పాడుచేయును.

ఆ॥ వె॥ హీన గుణమువాని । నిలు చేరనిచ్చిన
ఎంతవానికైన । నిడుము గలుగు;
ఈగ కడుపుజొచ్చి । ఇట్టట్టుచేయదా ? ॥ వి॥

టీ॥ వేమా! హీనగుణమువానిన్=బుద్ధిలేనివానిని, ఇలు=గృహము, సేరనిచ్చినన్=ప్రవేశింప జేసినచో, ఎంతవానికైనన్=ఎంతగొప్పవానికైనను, ఇడుము=అపద, కలుగున్ = సంభవించును, చొచ్చి=ప్రవేశించి, ఇట్టట్టు సేయదా=కలతపెట్టదా? (బాధ కలిగించునని భావము.)

తా॥ వేమన్నా! ముఱికి పదార్థములను తిను ఈగ కడుపులో ప్రవేశించిన ఎంత వికారముగల్గి బాధజనించునో, అంతగా మూర్ఖుడగు వానిని ఇంటిలో తిరుగనిచ్చిన అసహ్యము, అపద సంభవించును.

ఆ॥ వె॥ ముష్టి వేపచెట్టు । మొదలంట నరులకు
పరగ మూలికలకు । పనికివచ్చు;
నిర్దయాత్మకుండు।నీచు డెందులకౌను ? ॥ వి॥

టీ॥ వేమా! ముష్టి=ముష్టిచెట్టు, మొదలంటన్=అనుతో గల చెట్టంతయు, పరగన్=చక్కగా; మూలికలను=మందులలో

వాడుటకు, నరులకుఁ=జనులకు, పనికివచ్చుఁ=ఉపయోగించును, నిర్దయాత్మకుండు = దయలేని మనస్సుగలవాడు, నీచుడు=మూర్ఖుడు, ఎందులకు + ఔను = ఏపనికి ఉపయోగించును ? (పనికిరాడని భావము.)

తా॥ ముష్టిచెట్టు, వేపచెట్టు చేదుగుణము కలవైనను, అవి మందులకు ఉపయోగపడి ప్రజలకు మేలుచేయుచున్నవి. కాని దయలేనివాడగు మూర్ఖుడు ఏవిధముగా కూడ ప్రజలకు సహాయకారి కాడు.

ఆ॥ వె॥ విద్యలేనివాడు । విద్యాధికులచేరి
ఉండినంత బండితుండు కాడు,
కొలని హంస జేరి।కొక్కెర హంసౌనె ? ॥వి॥

టీ॥ వేమా ! విద్య=చదువు, విద్యాధికులు = విద్యలలో ఘనులు, ఉండినంతఁ = ఉన్నంతమాత్రమువలన, పండితుండు=గొప్పవిద్యకలవాడు, కొలనిహంస=సరోవరముల దగ్గర ఉండే రాజహంసను, చేరి=సమీపించి (దానితో తిరిగినంత మాత్రమున) కొక్కెర=కొంగ, హంస + ఔనె=హంస కాజాలునా ? (కాదు.)

తా॥ వేమన్నా ! సరోవరముల దగ్గరఉండి నిర్మలమైన ఆ నీటిని త్రాగి బ్రతుకు హంసలతో, మురికినీటిని త్రాగు కొంగ చేరి, ఆ హంసలతో తిరిగినంతమాత్రమున, హంస ఎట్లు కాజాలదో, అట్లే విద్యలేనివాడు, విద్యగలవానితో సంచరించినను వానికి గౌరవము కలుగదు.

ఆ॥ వె॥ అల్పుడైన వాని । కధికార మొసగిన
దొడ్డవారి నెల్ల । దొలగ గొట్టు
అల్పజాతిమొప్పె । యధికుల నెఱుగునా ? ॥వి॥

టీ॥ వేమా! అల్పుడు + అయినవానికిన్ = తెలివిలేనివాడు అయినట్టి నీచునకు, అధికారము=పెద్దరికము, ఒసగినన్=ఇచ్చిన యెడల, దొడ్డవారిన్=పెద్దవారలను (గుణవంతులను), ఎల్లన్= అందఱను, తొలగగొట్టున్ = దూరముచేయును, అల్పజాతి మొప్పె=తక్కువకులములో బుట్టిన మూర్ఖుడు, అధికులన్= గొప్పవారి (శక్తి) ని, ఎఱుగునా ? = తెలియగలుగునా ? (తెలియలేడు.)

తా॥ వేమన్నా! తక్కువకులములోబుట్టిన విద్యలేని మూర్ఖునకు అధికారము ఇచ్చినచో, పెద్దవారల యొక్కమంచిని తెలిసికొనలేక వారిని తనకు దూరముగా చేసికొని, తుదకు తాను పాడగును.

ఆ॥ వె॥ ఎలుకతోలుదెచ్చి । యేడాది యుతికిన
నలుపు నలుపె గాని । తెలుపురాదు,
కొయ్యబొమ్మదెచ్చి।కొట్టినఁ బలుకునా ? ॥వి॥

టీ॥ వేమా! తోలున్=చర్మమును, ఏడాది=సంవత్సరము, ఉదికినన్ = నీటిలోతడిపి శుభ్రపరచినను, కొయ్యబొమ్మన్ = కఱ్ఱతోచేసిన బొమ్మను, పలుకునా=మాట్లాడునా ?

తా॥ వేమన్నా! ఎలుకతోలును ఎన్నాళ్ళు ఉతికినను

దానినలుపురంగు పోయి, తెల్లగా కాదు. కఱ్ఱబొమ్మను ఎంత కొట్టినను మాటాడదుగదా ? అట్లే—తెలివితక్కువవానికి ఎంత నీతి బోధించినా వాడు, తన గుణమును విడువడని భావము.

ఆ॥ వె॥ పాలు బంచదార । పాపరపండ్లలో
చాలబోసి వండ । చవికి రాదు;
కుటిలమానవులకు । గుణమేల వచ్చురా ! ॥వి॥

టీ॥ వేమా ! పాపరపండ్లలోన్=చేదుగానుండు ఒక విధమగు పండ్లు వండఁగ=వండినయెడల, చవికి=రుచికి, కుటిలమానవులకు=మాయతో నిండిన మనుజులకు, గుణము=మంచిబుద్ధి.

తా॥ వేమా ! మిక్కలి చేదుగానుండు పాపర పండ్లలో పాలు, పంచదార ఎక్కువగా కలిపి వండినను చేదుపోయి తీపి రాదు. అట్లే ఎల్లప్పుడు మాయలుచేసి బ్రతికేవాడు, ఎవరెంత నీతి చెప్పినను మంచిగుణము పొందజాలడు.

ఆ॥ వె॥ పాల నీడిగింట । గ్రోలుచు నుండినఁ
మనుజులెల్ల గూడ । మద్యమండ్రు;
నిలువ తగనిచోట। నిలువనిందలువచ్చు॥ వి॥ 22

టీ॥ వేమా ! ఈడిగింటఁ=కల్లుఅమ్మెడివాని ఇంటిలో, పాలఁ=పాలు గ్రోలుచునుండినన్ = త్రాగుచున్నను, మనుజులు+ఎల్లన్ కూడ=ప్రజలు అందరును, మద్యము=కల్లు, అండ్రు=అనెదరు, నిలువఁ=ఉండుటకు, తగనిచోటఁ = పనికి

రాని స్థలములో, నిలువఁగా=ఉన్న యెడల, నిందలు=అపవాదులు, వచ్చుఁగా=కలుగును.

తా॥ కల్లునమ్మెడి ఈడిగవాని గృహములో పాలు త్రాగుచున్నను ప్రజలు వాడు కల్లుత్రాగుచున్నాడనియే తలంతురు. అట్లే పనికిరాని స్థలమున నుండినచో అపనిందలు తప్పక రాగలవని భావము.

ఆ॥ వె॥ అనువుగానిచోట । నధికుల మనరాదు
కొంచెముండు టెల్ల । కొదువగాదు
కొండ యద్దమందు । కొంచమై యుండదా
విశ్వదాభిరామ వినురవేమ!

ఆ॥ వె॥ అనువుగానిచోట । నధికుల మనరాదు
కాలమొక్కరీతి । గడువబోదు
విజయు డమ్ముమీడి । విరటుని గొల్వడే ? ॥వి॥

టీ॥ అనువు = అవకాశము, అధికులము=గొప్పవారము, గడువదు=కొనసాగదు; నెరవేరదు, విజయుడు = అర్జునుడు, అమ్ము=బాణము, వీడి=వదలి, కొల్వడే=సేవించడే.

తా॥ ఎంత గొప్పవాడైనను వీలులేనిచోట తన గొప్పదనమును చెప్పుకొనరాదు. అందువలన లాభమ్మును కలుగదు. అర్జునునివంటి మహావీరుడు తనకు వీలు దప్పినపుడు విరాటరాజు అనువాని దగ్గర సేవకుడై ఉండెను గదా!

ఆ॥ వె॥ తామసించి చేయ । దగ దెట్టి కార్యంబు
వేగిరింప నదియు । విషమె యగును
పచ్చికాయ దెచ్చి । పడవేయ ఫలమౌనె॥ వి॥

టీ॥ తామసించి=కోపము బూని, ఎట్టికార్యంబుఁగా = ఏ

పనియుగూడ, చేయదగదు=చేయకూడదు, వేగిరింపన్=తొందర పడుట వలన, విషమె=పనికిరానిదే (నశింపజేయు పదార్థము, విషము), ఫలము=పండు.

తా॥ కోపముతో ఏకార్యమును చేయరాదు త్వరపడి చేసినచో ఆపని నశింపు అగునుకాని ఫలితమునకు రాదు. పచ్చి కాయనుతెచ్చి దాచినచో పండుకాదు. (పక్వమునకు వచ్చిన దైనచో పండుఅయి ఉపయోగపడును.)

ఆ॥ వె॥ నీళ్ళలోన మీను । నిగిడి తిన్నగ బ్రాకు
బైట మూరెడైన । పాఱకలేదు
నెలవుదప్పుచోట । నేర్పరి కొఱగాడు॥వి॥ 25

టీ॥ మీను=చేప, నిగిడి=గర్వించి, పాఱకున్ = జరుగును (నడచును) మూరెడు=అరగజము, నెలవున్=తాను ఉండుస్థల మును, తప్పుచోటన్=విడిచిన స్థలమందు, నేర్పరి=తెలివిగల వాడు (అయినను) కొఱగాడు=పనికిరాడు.

తా॥ ఎంతటి గొప్పవాడు అయినను పరస్థలమునందు మెప్పును పొందుట చాలకష్టము. తనస్థలమును వీడినచో చేప బయట అర్ధగజము దూరమైనను ప్రాకలేదుగదా ?

ఆ॥ వె॥ నీళ్ళలోన మకరి । నిగిడి యేనుగుబట్టు
బైట కుక్కచేత । భంగపడును
స్థాన బలిమిగాని । తనబలిమి కాదయా ॥వి॥

టీ॥ మకరి=మొసలి, పట్టున్=బంధించును, భంగపడును= అవమానముచెందును, స్థానబలిమి=తనయొక్క శక్తిగలచోటు: (జన్మస్థానము) తనబలిమి=తనయొక్క బలము.

తా॥ నీటిలో ఉన్నప్పుడు మొసలి ఏనుగునైనను బంధించు శక్తికలదైయుండును. కాని, బయటకు వచ్చిన కుక్కచేతకూడ కఱవబడి నశించును. అట్లే జన్మస్థానము (తనకు పలుకుబడి గల స్థలము)ను విడిచినవాడు అల్పులతోకూడ అవమానము పొందునని భావము.

ఆ॥ వె॥ ఎఱుగువాని దెల్ప । నెవ్వడైనను జాలు
నొరులవశముకాదు । నోగుదెల్ప;
ఏటివంక దీర్ప । నెవ్వరి తరమయా ॥వి॥ 27

టీ॥ ఎఱుగువానిన్=గొప్పపేరుగలవానికి, తెల్పన్=తెలియ పరచుటకు, ఓగుణ=మూర్ఖునికి, ఒరులవశము=ఇంకొకరితరము, ఏటివంకణ=కాలువయొక్క వంకర, తీర్పన్ = సరిచేయుట, ఎవ్వరి తరమయా=ఎంతగొప్పవానికిని తరముకాదు.

తా॥ చెప్పిన వినువాడు, ఎవరుచెప్పినను విని ఆలోచించి తనకార్యము నెరవేర్చుకొనును, మూర్ఖునకు ఎవరు ఎంత నీతిని బోధించినను వినక పాడగును. ఎంతటిగొప్పవాడైనను కాలువ యొక్క వంకర తీర్పలేడుగదా!

ఆ॥ వె॥ తాను గుడువ లేడు । తగవేరెయాప్తుల
జేరనివ్వ, డట్టి । చెడుగువాడు
చేనిలోనమంచు । జేసి కట్టిన బొమ్మ ॥వి॥ 82

టీ॥ కుడువలేడు=తినజాలడు, తగఁ=చక్కగా, వేరె= ఇంకొక, అప్తులఁ=బంధువులను, చేరనివ్వడు=దగ్గరకు రానీ యడు, అట్టిచెడుగువాడు=అటువంటిలోభి, చేనిలోనన్=పొలము నందు, చేసికట్టిన=తయారుచేసి, ఉంచు=ఉంచిన, బొమ్మ= ప్రతిమ.

తా॥ తాను తినక, ఇతరులకు ఏమియుబెట్టక, బంధువులను కూడ దగ్గరకు రానీయక బ్రతికెడివాడు, పొలములో దిష్టిపోవు టకు కట్టబడిన గడ్డిబొమ్మతో సమానము.

ఆ॥ వె॥ నీళ్ళలోని మీను । యెఱ మాంసమును జూచి
గాలమందు దగిలి । కూలినట్లు
ఆశవలన మనుజు । డారీతి జెడిపోవు ॥వి॥ 29

టీ॥ మీను=చేప, ఎఱ=వానపాము దగిలి=చిక్కుకొని, కూలినట్లు=నశించినరీతిగా, ఆశ=కోరిక, చెడిపోవుఁ=పాడగును.

తా॥ నీటిలో నున్నచేప గాలమునకు తగిలింపబడిన మాంస మును తినవలెనని దురాశతో వచ్చి చచ్చినట్లుగా, దురాశలకు చిక్కినమనుజుడు కష్టాలపాలగునని భావము.

ఆ॥ వె॥ తల్లిదండ్రిమీద । దయలేని పుత్రుండు
పుట్టనేమి వాడు । గిట్టనేమి
పుట్టలోన చెదలు । పుట్టవా గిట్టవా ? ॥వి॥ 30

టీ॥ దయ = ప్రేమ, పుట్టఁ + ఏమి? = పుట్టినందువలన

లాభము ఏమిటి ? గిట్టక + ఏమి=మరణించినమాత్రముఏమి ?' చెదలు=చెదపురుగులు, పుట్టవా=పుట్టుటలేదా, గిట్టవా=చచ్చుట లేదా !

తా॥ పుట్టలోని చెదపురుగులు పుట్టుచుండును, చచ్చుచుండును. వానివలన ఎవ్వరికి లాభము లేదుగదా ! అట్లాగే తల్లిదండ్రులను దయతో చూడనివాడు ఆ చెదపురుగులరీతిగా బ్రతికియున్నను చచ్చినను ఒక్కటియే యనిభావము.

ఆ॥ వె॥ తేనె తెరలజాడ । తేనెటీగ యెఱుంగు
సుమరసంబుజాడ । భ్రమర మెఱుగు
పరమయోగి జాడ । భక్తుడెఱుంగును ॥వి॥ 31

టీ॥ తేనెతెరలు = తేనెపట్టులు, జాడక=ఆ స్థలమును, యెఱుంగుక=తెలిసికొనును, సుమరసంబు=పువ్వులలోగల తేనె, భ్రమరము=తుమ్మెద.

తా॥ తేనెపట్టులుగల స్థలమును తేనెటీగలకు తెలియును. పువ్వులలోగల తేనెరుచిని తుమ్మెద యెఱుంగును. అట్లే మహాత్ములయొక్క గొప్పదనమును వారియందు నమ్మకముగల భక్తుడెఱుంగును. (తెలివిగలవాడు మంచి యెక్కడనున్నను తెలిసికొనవలెనని భావము)

ఆ॥ వె॥ ధనముకూడబెట్టి । ధర్మంబు సేయక,
తాను దినక లెస్స । దాచు లోభి;
తేనె నీగ గూర్చి । తెరవరి కీయదా ॥వి॥ 32

టీ॥ లోభి=పిసినిగొట్టు, లెస్స=బాగుగా, కూడబెట్టి=సంపా దించి, ధర్మంబుఁ=దానమును, సేయక=ఒనరింపక, తానుఁ= అతడుకూడ, కూర్చి=ప్రోగుచేసి, తెరవరికిఁ=ప్రయాణికునకు (ఇతరులకు) ఈయదా=ఇచ్చునని భావము.

తా॥ తేనెటీగ తేనెను సంపాదించి ఇతరులకు దారబోసి నట్లుగా లోభియగువాడు తాను తినక, ఇతరులకు పెట్టక గడిం చిన ధనమును తనవారికి గూడ చెందనట్లుగా పాడుచేయును.

ఆ॥ వె॥ పరగ ఱాతిగుండు । పగులగొట్టగవచ్చు
కొండలన్ని పిండి । గొట్టవచ్చు;
కఠినచిత్తు మనసు । గఱగింపరాదయా ॥వి॥

టీ॥ పరగఁ = చక్కగా, ఱాతిగుండున్=బండఱాయిని, పగులన్=ఖణ్డలగునట్లుగా, పిండిఁ=పొడిగా (చూర్ణముగా) కఠిన చిత్తు మనసుఁ=దయలేనట్టివాని బుద్ధినిమాత్రము, కఱగింప లేము=సరిచేయలేము.

తా॥ శక్యముకానట్టి పెద్ద బండరాయినైనను ముక్కలు ముక్కలుగా చేయవచ్చును. పర్వతములను పొడిపొడిగా చేయ వచ్చును. కాని కరుణలేని మూర్ఖుని మనస్సును మాత్రము మంచిమార్గములోనికి తీసికొనిరాలేము.

ఆ॥ వె॥ ఆపదందు జూడు । మారయ బంధులఁ
భయమువేళ జూడు । బంటుగుణము
పేదపడ్డవెనుక । పెండ్లాము స్థితిజూడు॥వి॥ 34

టీ॥ ఆపద + అందుఁ=కష్టము కలిగినప్పుడు, బంధులఁ=బంధువులను, భయము వేళఁ=తనకాపదసమయములో, బంటుగుణముఁ=సేవకునియొక్క విశ్వాసమును, చూడుము=కనుగొనుము, పేదపడ్డ వెనుకఁ=దరిద్రముగల దినములలో, పెండ్లాముస్థితిఁ=భార్యయొక్క నడవడికను, చూడుము.

తా॥ ఆపదవచ్చినప్పుడు సహాయపడిన బంధువులే బంధువులు, తనకు ధైర్యము నిచ్చి వెంటనిల్చు సేవకుడే సేవకుడు- దరిద్రస్థితి కలిగినప్పుడు చక్కగా నడుచుకొను భార్యయేభార్య- (సమయమునకు పనికివచ్చునది ఎంతచిన్నదైనను గొప్పదియే అనియు, పనికిరానిదెంత ఘనమైనను వ్యర్థమనియు భావము.)

ఆ॥ వె॥ తప్పులెన్నువారు । తండోపతండముల్
ఉర్విజనులకెల్ల । నుండు తప్పు;
తప్పులెన్నువారు । తమ తప్పు లెరుగరు ॥వి॥

టీ॥ తప్పులు=నేరములు, ఎన్నువారు = చూపించువారు, తండోప తండముల్ = చాలమంది (గుంపులు గుంపులుగా ఉందురు) ఉర్విజనులకు + ఎల్లఁ=లోకములగలవా రందరికిన్ని, తప్పు=దోషము, ఉండుఁ= ఉండును. తప్పులెన్నువారు= దోషములను చూపించేవారు, తమతప్పులు = వారిదోషములను, ఎరుగరు=తెలిసికొనరు.

తా॥ ఒకరి దోషములను చూపెట్టువారు ఎంతోమంది ఉందురు. కాని, వారి తప్పును వారు గ్రహింపలేరు. లోకములో

ప్రతివాని యందును ఏదోయొక దోషము ఉండును (ఒకరిని ఎప్పుడును నిందింపరాదని భావము.)

ఆ॥ వె॥ మాట నిలుపలేని । మనుజుడు ఛండాలు;
డాజ్ఞలేని రాజు । ఆడుముండ;
మహిమలేని వేల్పు । మట్టిజేసినపులి ॥వి॥ 36

టీ॥ మాటన్=పలుకులను, నిలుపలేని = నెరవేర్పలేని, ఛండాలుడు=మాలవాడు, ఆజ్ఞ=శాసనము, మహిమలేని=కోర్కె తీర్చని, వేల్పు=భగవంతుడు.

తా॥ తాను పలికినట్టి మాటల ప్రకారము నడుచుకొనిన నరుడు మాలవానితో సమానము. రక్షించుట, శిక్షించుట లేనట్టి రాజు ఆడుదానితో సమానము. కోర్కెలు తీర్చిన దేవుడు మట్టితో చేసిన పులితో సమానము.

ఆ॥ వె॥ ప్రియము లేని విందు । పిండివంటలుచేటు
భక్తిలేనిపూజ । పత్రిచేటు
పాత్రి మెఱుగ నీవి । బంగారు చేటురా ॥వి॥

టీ॥ ప్రియము=ప్రేమ; చేటు=దండుగ, పాత్రన్=యోగ్యతను, ఈవి=దానము, బంగారు=బంగారము.

తా॥ ఇష్టములేక ఎన్ని పిండివంటలు చేసి పెట్టినను లాభములేదు. భక్తిలేనిది భగవంతుని పూజించినను అంతియే. అదేరీతి దానము యిచ్చునప్పుడు వాని యొక్క మంచిని తెలిసి

కొని ధర్మమును చేయవలెను. అట్లుకానిచో ఇచ్చేడు బంగారము నష్టమేకాక పాపముకూడ గలుగును.

ఆ॥ వె॥ గాడిద యొడలంత । గంధంబు బూసినఁ
ఎఱుగలేక లేచి । యెగసి తన్ను
ఈడుకానివాని । ఇంగిత మీలాగు ॥వి॥ 38

టీ॥ ఒడలు + అంతఁ=శరీరమంతటికిని, పూసినఁ=పులిమినచో, ఎఱుగలేక=తెలిసికొనజాలక, యెగసి=ఎగిరి, ఈడుకానివాని=తనతో సమానుడు కానట్టి వానియొక్క, ఇంగితము=తలంపు; కోరిక.

తా॥ గాడిదకు శరీరమంతటికిని గంధము పూసినను అది ఆగంధముయొక్క విలువ తెలిసికొనలేక ఏమోచేయుదురని ఎగిరితన్నును. అలాగే మనతో సమానుడుకానివానికి మనరహస్యములు చెప్పిన వాడింకొక విధమున తలంచి, మనకే హాని కలిగింపగలడని భావము.

ఆ॥ వె॥ చచ్చిపడిన పశువు । చర్మంబు కండంబు
పట్టి పెఱికి తినును । పరగ గ్రద్ద,
గ్రద్దవంటివాడు । గజపతి కాడొకో ! ॥వి॥ 39

టీ॥ పశువు=జంతువు, చర్మంబు=తోలు, కండంబు=మాంసపుముద్ద, పెఱికి=చీల్చి, పరగ=చక్కగా, గజపతి=ఏనుగులను పోషించువాడు. (రాజు)

తా॥ మరణించిన జంతువులయొక్క మాంసమును తిను గృద్దయును, దరిద్రమువలన బాధపడు మనుజులను పీడించు రాజును ఒకటియేయని భావము.

ఆ॥ వె॥ కల్లలాడువాని । గ్రామకర్తయెఱుంగు,
సత్యమాడువాని । స్వామి యెరుగు
పెక్కు తిండిపోతు । పెండ్లా మెరుంగురా ॥వి॥

టీ॥ కల్లలు = అబద్ధములు, గ్రామకర్త = కరణము, సత్యము=నిజము, స్వామి=భగవంతుడు, పెక్కుతిండిపోతున్= ఎక్కువభుజించువానిని, పెండ్లాము=భార్య.

తా॥ అబద్ధములు పలుకువానిని కరణము ఎఱుంగున ట్లును, ఎక్కువగా తినువానిని భార్య తెలిసికొనునట్లును, నిత్యము సత్యమునే పలుకువానిని భగవంతుడు తెలిసికొనును (రక్షించును.)

ఆ॥ వె॥ ఉప్పులేనికూర । చప్పన రుచులకు,
పప్పులేని తిండి । ఫలములేదు,
అప్పు లేనివాడె । అధిక సంపన్నుడు ॥వి॥

టీ॥ ఫలము=ఫలితము, అప్పు=ఋణము, అధిక ధన సంపన్నుడు=ఎక్కువగా పైకము ఉన్నవాడు (ధనవంతుడు.)

తా॥ ఉప్పులేనికూర చప్పనై ఎట్లురుచి ఉండదో, పప్పులేని ఆహారము ఎట్లు బాగుగానుండదో, అట్లే అప్పుగలవానికి గౌర వముతగ్గి విలువతగ్గును. అప్పులేనివాడు ధనవంతుడనియే చెప్ప వచ్చునని భావము.

ఆ॥ వె॥ కానివానితోడ । గలసి మెలగుచున్న
కానివానిగానె । కాంతు రతని
తాటిక్రింద పాలు । త్రాగిన చందమౌ ॥వి॥ 42

టీ॥ కానివానితోడ౯=తెలివిహీనులతోడ, కలసి=జతచేసి, మెలగుచున్న౯=తిరుగుచున్నచో, కానివానిగానె=హీనునివలెనే, కాంతురు=చూచెదరు, తాటిక్రింద౯=తాటిచెట్టుక్రింద.

తా॥ మూర్ఖులతో స్నేహముచేసి, మంచివాడు తిరుగుచున్నయెడల వానినికూడ చూచువారందరును మూర్ఖుడనియే తలంతురు. తాటిచెట్టుక్రింద పాలుత్రాగినను కల్లు అనియే నమ్మెదురుకదా !

ఆ॥ వె॥ కోపమునను ఘనత । కొంచెమైపోవును
కోపమునను మిగుల । గోడు కలుగు
కోప మడచెనేని । కోర్కె లీడేరురా ! ॥వి॥

టీ॥ ఘనత=గొప్పదనము (గౌరవము), కొంచెము + ఐపోవును=తక్కువ అగును, మిగుల౯=ఎక్కువగా, గోడు=దుఃఖము, అడచెనేని౯=తగ్గించుకొన్నచో, కోర్కెలు=తలపులు, ఈడేరు౯=నెరవేరును.

తా॥ కోపముగలవానికి గౌరవము తగ్గిపోవును, కోపమువలన దుఃఖముకూడ ఎక్కువగా కల్గును. కోపము తగ్గించుకొని చేసిన కార్యములే నెరవేరును. (కోపము పనికిరాదని భావము.)

ఆ॥ వె॥ కులములేనివాడు । కలిమిచే వెలయును
కలిమి లేనినాడు । కులము దిగును
కులముకన్న భువని।కలిమియెక్కువసుమీ ॥వి॥

టీ॥ కులము=జాతి, కలిమి=సంపద, వెలయును=ప్రకాశించును, లేనినాడు = లేనట్టిదినమందున, భువిని=ప్రపంచములో, దిగును=తగ్గును.

తా॥ ప్రపంచమునందు ధనముగలవానినే అందరును గౌరవింతురు. వాడు తక్కువకులమున జన్మించినను సరియే. పెద్దవంశముగలవాడైనను ధనములేక పోయినచో వానిని హీనముగా చూతురు. కావున కులముకన్న కలిమియే యెక్కువ అని తెలియవలెను.

ఆ॥ వె॥ కులము కలుగువాడు । గోత్రంబు గలవాడు
విద్యచేత చాల । వెలయువాడు
పసిడికల్గువాని । బానిసకొడుకులు ॥వి॥ 45

టీ॥ కులము = వంశము, గోత్రము = వంశగౌరవము, వెలయువాడు=ప్రకాశించువాడు, పసిడి కల్గువాని=ధనవంతుని యొక్క, బానిస కొడుకులు=పరిచారకులు,

తా॥ మంచిగౌరవముగల కులమున బుట్టినవాడైనను, విద్యలయందు గొప్పగా పేరు గడించిన వాడైనను ధనవంతుని ముందు లొంగియే ఉండును.

ఆ॥ వె॥ ఏమి కొంచువచ్చె । ఏమి తా గొంపోవు ?
పుట్టువేళ నరుడు । గిట్టువేళ
ధనము లెచటికేగు । తానెచ్చటికి నేగు ॥వి॥

టీ॥ నరుడు=మనుష్యుడు, పుట్టువేళన్ = పుట్టినప్పుడు, ఏమికొంచువచ్చెన్ = ఏ వస్తువును తనతోతెచ్చెను (తేలేదని భావము) గిట్టువేళన్=చచ్చునప్పుడు, ఏమితాన్ + కొంపోవు= ఏమితీసికొనివెళ్ళును.

తా॥ ప్రతి మనుష్యుడును జన్మించునప్పుడు ఏవస్తువును తీసికొనిరాడు, మరణించునప్పుడు తీసికొనిపోడు. తాను గడిం చిన ధనము ఏమగునో, తాను ఏమగునో తెలియదు. (కావున బ్రతికినన్నాళ్లు మంచిగా దానధర్మములతో జీవించవలెనని భావము.)

ఆ॥ వె॥ అన్ని దానములకు । నన్నదానమెగొప్ప,
ప్రీతి సాక మాతృ । ప్రేమగొప్ప
ఎన్నగురుని ప్రేమ । యెక్కువదౌ గొప్ప ॥వి॥

టీ॥ అన్నిదానములకున్ = ఏ ధర్మమునందైనను, అన్న దానమె=భోజనము పెట్టుట యను ధర్మమే, గొప్ప=చాల ఘన మైనది. ప్రీతన్=ఇష్టముతో, సాకన్=పెంచుటలో, మాతృప్రేమ= తల్లిప్రేమయే, గొప్ప=ఘనమైనది. ఎన్నన్=చూడగా, గురుని ప్రేమ=ఉపాధ్యాయులయొక్కదయయే. ఎక్కువది + ఔ=చాల ఎక్కువగలది.

తా॥ దానములయందు అన్నదానమునకు మించినదిలేదు. కరుణతో పెంచుటకు తల్లిప్రేమవంటి ప్రేమలేదు. నీతి నేర్పునట్టి బడిపంతులవారి యొక్క దయకంటె వేరె దయలేదు.

ఆ॥ వె॥ సాధుజనులచెలిమి । చాలింపగారాదు
ప్రకృతి విడకగాని । పరములేదు
పిందె కోసి చూడ । బీజంబుగల్గునే? ॥వి॥ 48

టీ॥ సాధుజనుల= మంచివారియొక్క, చెలిమిన్=స్నేహమును, చాలింపగారాదు = విడువరాదు, ప్రకృతి=ప్రపంచము (మాయతోకూడిన శరీరము) విడకజ + కాని=విడిచిపెట్టినగాని, పరము=ముక్తి, బీజంబు=విత్తనము.

తా॥ మంచివారియొక్క స్నేహమును ఎప్పుడును విడువకూడదు. వారివలన ముక్తిమార్గము లభించును. పిందెయందు విత్తనము ఉండదుగదా! (చెడ్డవారియందు మంచి ఉండదని భావము.)

ఆ॥ వె॥ ప్రముచ్చు గుడికిబోయి । ముడి విప్పునేగాని
పొసగ స్వామిజూడ । పోడతండు
కుక్క యిల్లు జొచ్చి । కుండలు చూడదా? ॥వి॥

టీ॥ ప్రముచ్చు=దొంగ, ముడివిప్పుట=దొంగతనముచేయుట పొసగన్=మంచిగా, చొచ్చి=ప్రవేశించి, జారుడు=విటుడు.

తా॥ కుక్క ఇంటిలో ప్రవేశించి కుండలు వెదకునట్లు

గానే, పాపశీలముగలవాడు దేవాలయము చనినను దేవుని దర్శింపక, తననైజ బుద్ధినే చూపించును. (దొంగ దొంగపనియే చేయును. జారుడు జారత్వమునకే చూచును.)

ఆ॥ వె॥ అంతరంగమందు । నపరాధములుచేసి
మంచివాని వలెనె । మనుజుడుండు
ఇతరు లెరుగకున్న । ఈశ్వరు డెరుగడా ! ॥వి॥

టీ॥ అంతరంగమందున్=రహస్యస్థలములందు, అపరాధములు=నేరములు, ఈశ్వరుడు=భగవంతుడు.

తా॥ ఇతరులకు తెలియనట్లుగా మనుష్యుడు ఎన్నో నేరములు చేసి, మంచివానిలాగున పైకి నీతివాక్యములు చెప్పును. ఇది మంచిదికాదు. భగవంతుడు వానికి తగినశిక్ష చూపింపకపోడు.

ఆ॥ వె॥ అప్పుదీయరోత । హరిహరాదులకైన
మొప్పెతోడ మైత్రి । మొదలెరోత
తప్పు బలుకరోత । తాకట్టుబడరోత ॥వి॥ 51

టీ॥ అప్పుదీయన్= ఋణముచేయుట, రోత=నీచమైనది. హరి హరాదులకు + ఐనన్=శివుడు, విష్ణువు మొదలగువారికైనను, మొప్పెతోడన్ = మూర్ఖునితో, మైత్రి=స్నేహముగా ఉండుట, మొదలె=ముఖ్యముగా, రోత =నిందింపతగినది. తప్పుబలుకన్= అసత్యములాడుట, తాకట్టుపడన్=నిందలుపడుట, రోత=మంచిది కాదు.

తా॥ భగవంతునికైనను ఋణముచేయుట మంచిదికాదు. మూర్ఖునిస్నేహము ముఖ్యముగా పనికిరాదు. అబద్ధములు పల్కరాదు. నిందలు చెందరాదు.

ఆ॥ వె॥ చాకివాడు కోక । చీకాకుపడ గొట్టి
మైల బుచ్చి మంచి । మడుపుచేయు;
బుద్ధిచెప్పువాడు । గ్రుద్దిన నేమిరా ॥వి॥ 52

టీ॥ చాకివాడు=చాకలివాడు, కోకన్=వస్త్రమును, చీకాకు పడన్ + కొట్టి=బాగుగా ఉతికి, మైలబుచ్చి=మురికిని తీసివేసి, మంచిమడుపు=శుభ్రముగా మడత (ఇస్త్రీ) చేయున్=చేయును, బుద్ధిచెప్పువాడు=నీతిమార్గమును తెలియజేయువాడు, గ్రుద్దినన్=కొట్టినను, ఏమిరా=లాభము ఉన్నదిగదరా.

తా॥ మంచిమార్గమును బోధించువాడు ఒకానొక సమయమున, తిట్టినను తనమేలునకే కావున సహించి వినవలెను. చాకలివాడు మురికిబట్టలను బాగుగా కొట్టి ఉతికినందువలననే కదా అందులోని మురికపోయి శుభ్రముగా అగుచుండెను ?

ఆ॥ వె॥ రాతిలోని కప్ప । రమ్యమైయుండగా
నీరు నన్ను మచట । నేరు వైచె ?
పుట్టజేయు స్వామి । పోషింపదలచడా॥వి॥

టీ॥ రమ్యమై=చక్కగా, ఏరు=ఎవరు, పుట్టన్=పుట్టునట్లుగా, పోషింపన్=పెంచుటకు, తలచడా=ఆలోచింపడా.

తా॥ రాతియందుగల కప్పకు అన్నమునీరు యిచ్చునట్టి భగవంతుడు, పుట్టిన ప్రతిమానవునికి బ్రతుకుదెరువును చూపిం చునని భావము.

ఆ॥ వె॥ నేరనన్నవాడు । నెరజాణ ధరలోన
నేర్తునన్నవాడు । వ్యర్థుడెందు
నూరకున్నవాడె । నుత్తమయోగిరా ॥వి॥ 54

టీ॥ నేరన్ + అన్నవాడు=తెలియదు అను పల్కువాడు. నెఱజాణ=గొప్పవాడు, ధరలోనన్=ప్రపంచమునందు, నేర్తున్= తెలిసికొందును, అన్నవాడు=(గర్వించి) పల్కువాడు, వ్యర్థుడు= తెలివి తక్కువవాడు, ఎందున్=ఏవానియందైనను, ఊరకున్న వాడె=ప్రయత్నము చేయనివాడే, ఉత్తమ యోగిరా=మంచిగుణ ములు గల యోగీశ్వరుడురా.

తా॥ అంతయు తెలిసియుండి తెలియదన్నవాడు నేర్పరి. ఏమియు దెలియక తెలియునని గర్వించి పల్కువాడు మూర్ఖుడు ప్రపంచములోగల ఏ భోగములయందును పూనుకొనక మెలగు వాడు యోగీశ్వరుడు.

ఆ॥ వె॥ చదువునందు, రాజ్య । పదవులందును, పాడి
మొదవులందు । స్త్రీల పెదవులందు
ఆశలుడుగునట్టి । అయ్యలు ముక్తులు ॥వి॥

టీ॥ పదవులందున్=ఉద్యోగములయందు, పాడి మొదవు లందున్=ఆవులయందును, స్త్రీల పెదవులందున్=ఆడువారిని

పొందఁదమన్న కోరికయందును, ఆశలు=భ్రాంతిని, ఉడుగు నట్టి = నశింపజేసికొనిన, అయ్యలు= మహాత్ములు, ముక్తులు= ధన్యులు.

తా॥ విద్యయందును, రాజ్యమందును, ఉద్యోగమునందును, పాడిపంటలయందును, స్త్రీల పొందు కోరుటయందును, విరాగియై కోరికలు నశింపుచేసికొనినవాడే నిజమైనయోగి. వాడే మిక్కిలిధన్యుడు.

ఆ॥ వె॥ ఉత్తము కడుపున । నోగు జన్మించినఁ
వాడు చెఱచు । వాని వంశమెల్ల;
చెఱకు వెన్నుబుట్టి। చెఱుపదా తీపెల్ల ॥వి॥ 56

టీ॥ ఉత్తము కడుపునన్ = మంచిగుణములు కలవాని గర్భమునందు, ఓగు=మూర్ఖుడు, జన్మించినన్ =పుట్టినచో, వాడు= ఆ పుట్టిననీచుడు, వానివంశము + ఎల్లన్ = అతనియొక్క పెద్దల గౌరమును, చెఱచున్=పాడుచేయును, చెఱకు=చెఱకునందు, వెన్నుబుట్టి=కంకిపుట్టి, తీపు + ఎల్ల=మధురమును అంతయు, చెఱుపదా ?=పాడుచేయును గదా !

తా॥ చెఱకునందు వెన్నుబుట్టి, ఆ చెఱకుయొక్క తీపినంతయు నశింపజేయునట్లుగా, మంచిగుణముకలవానికి తెలివిహీనుడు జనించినచో, వాడు చెడుటయేగాక వానిపెద్దలకు ఉన్న గౌరవమును కూడ పాడుచేయును.

ఆ॥ వె॥ చిక్కియున్న వేళ । సింహంబునైనను
ఒక్క కుక్క కఱచి । బాధపెట్టు
బలిమిలేనినాడు । పంతంబు చెల్లదు ॥వి॥ 57

టీ॥ చిక్కియున్నవేళఁ = కృశించియున్నప్పుడు, ఒక్క కుక్క=పనికిమాలినకుక్క, బలిమి=శక్తి, లేనినాడు=లేనట్టిరోజులలో, పంతంబు=పట్టుదల, చెల్లదు=పనికిరాదు.

తా॥ తనకు శక్తిలేని దినములలో పనికిరాని పట్టుదలలు పూనరాదు. దానివలన అవమానమే కలుగును. అల్పమైనకుక్క చేత కృశించియున్నప్పుడు సింహముకూడ భంగపడుట సహజము గదా !

ఆ॥ వె॥ చంపదగినయట్టి । శత్రువు తనచేత
చిక్కెనేని కీడు । చేయరాదు,
పొసగ మేలుజేసి । పొమ్మనుటేచాలు ॥వి॥ 58

టీ॥ శత్రువు=పగవాడు, కీడు=అపకారము, మేలు=ఉపకారము, పొసగఁ=అందముగా, చక్కగా.

తా॥ పగవాడైనను తనకు చిక్కినప్పుడు పూర్వపు శత్రుత్వమును తలంచి, అపకారము చేయరాదు. ఉపకారము చేసి నీతి బోధించి పంపించుటయే మానవధర్మము.

ఆ॥ వె॥ పరమహంస ననుచు । పలుకుచు సర్వదా
పరులధనము కొన । పడెడువాడు
పరమహంసకాడు । పరహింసు డనవచ్చు ॥వి॥

టీ॥ పరమహంస = సర్వమును విడిచినవాడు, సర్వదా= ఎల్లప్పుడు, పరులధనముకుఁ=ఇతరుల ద్రవ్యముకొరకు, పర హింసుడు=ఇతరులను హింసించువాడు.

తా॥ సర్వమును విడిచిపెట్టిన విరాగిని నేను-అని పైకి చెప్పుకొనుచు ఎల్లప్పుడు ఇతరుల సొమ్ముకొరకే ఆశపడెడువాడు, పరులను బాధించే హింసాత్ముడుగాని సజ్జనుడుగాడు.

ఆ॥ వె॥ పశులవన్నె వేరు । పాలన్ని యొక్కటి
పుష్పజాతి వేరు । పూజయొకటి
దర్శనములు వేరు । దైవంబు యొక్కటి ॥వి॥

టీ॥ పసులవన్నె=ఆవులయొక్క రంగు, వేరు=తేడా, దర్శనములు=రూపములు (చూడ్కులు).

తా॥ ఆవులయొక్క రంగులు భేదముగా ఉన్నను, వాని యొక్క పాలు అన్నియు తెల్లగానే ఉండును. పువ్వులు పలు విధములుగ ఉన్నను పూజకు ఒకరీతిగనే ఉపయోగించును. అట్లే భగవంతుని రూపములు అనేకరకములుగా ఉన్నను నిజముగా ఆతడు ఒక్కడే.

ఆ॥ వె॥ రామ విభునివలన । రఘుకుల మమరెను
కురు నృపాలువలన । కులము చెడియె;
మంచి చెడ్డ లరసి । మసలుట ధర్మంబు ॥వి॥

టీ॥ రామవిభునివలనఁ = శ్రీరామచంద్రుడు మంచిగా

నడచుటవలన, రఘుకులము=శ్రీరామునికులము, అమరెను= పేరుకాంచెను (స్థిరపడెను) కురున్నృపాలుడు వలనన్=దుర్యోధనుని దుర్నడతవలన, కులముచెడియె = వానివంశముయొక్క కీర్తినశించెను. అరసి=గమనించి (తెలిసికొని) మసలుట=నడచుకొనుట, ధర్మంబు=మంచిది.

తా॥ శ్రీరామచంద్రునివలన రఘుకులము వన్నెకెక్కెను. దుర్యోధనునివలన కురువంశము నశించియుండెను. కావున మానవుడు మంచి చెడ్డలను దెలిసికొని నడచుట మంచిదని తెలియవలెను.

ఆ॥ వె॥ దానధర్మములును । దయయు, సత్యము, నీతి
వినయ ధైర్యములును । వితరణంబు
రాజు పాలిటి కివి । రాజయోగంబులు ॥వి॥

టీ॥ దానము=ఉచితముగా ఇచ్చునది, ధర్మము=మంచి కార్యములకు సహాయముచేయుట, దయ=ప్రేమ, సత్యము= నిజముపలుకుట, నీతి=మంచినడవడిక, వినయము=శాంతము, ధైర్యము=ఉత్సాహము, వితరణము=త్యాగము (ఒకరిమేలునకై ప్రాణమునైన ఇచ్చుట) ఇవి=పైన చెప్పినవి, రాజుపాలిటికిన్= రాజులవద్దనుండవలసిన, రాజయోగంబులు=మంచిగుణములు.

తా॥ దానము, ధర్మము, ప్రేమ, సత్యవచనము, మంచి నడత, త్యాగము, శాంతము, ఉత్సాహము-అనునవి రాజులకు ఉండవలసిన లక్షణములు.

ఆ॥ వె॥ ఎంత కలిమిగల్గు । నంత నష్టముగల్గు
చింత గల్గు దాన । చివుకు మేను
చింత లేక యుంట । యెంతయో సంపద ॥వి॥

టీ॥ కలిమి=సంపద, నష్టము=కీడు, చింత=విచారము, దానన్=అందువలన, మేను = శరీరము, చివుకున్=నశించును, సంపద=ఐశ్వర్యము.

తా॥ ఎంత ఎక్కువగా ఐశ్వర్యము కల్గుచుండునో అంత ఎక్కువగ కీడు కలుగుచుండును. అందువలన విచారము ఎక్కువ అయి శరీరము కృశించును. చింతలేక ఉండువాడే మంచి సంపదగల్గవాడు అనిభావము.

ఆ॥ వె॥ అవనిలోన కల్ల । లాడెడువా నింట
వెడలకేల లక్ష్మి । విశ్రమించు ?
నీర మోటికుండ । నిలువని చందాన ॥వి॥ 64

టీ॥ నీరము=జలము, ఓటికుండన్=పగిలిపోయినకుండలో నిలువని చందానన్=ఉండనిరీతిగా, అవనిలోనన్=ప్రపంచములో కల్లలు=అబద్ధములు లక్ష్మి=సంపద, వెడలక=చనక, నశింపక, విశ్రమించున్ ? = నిలబడునా ?—(ఉండదని భావము)

తా॥ పగిలినకుండలో నీళ్ళు ఉండనిరీతిగా, ఎల్లప్పుడు అబద్ధములు పల్కువానియింటిలో సంపధ నిలువదని భావము

ఆ॥ వె॥ విద్య కలిగియుండి । వితరణిగాకున్న
నయిదువులకు మేలి । మయిన మణుల
సొమ్ము లుండి కంఠ । సూత్రము లేనట్లు ॥వి॥

టీ॥ వితరణి=దానముసేయువాడు, (త్యాగి) అయిదువులకుఁ=సుమంగళులకు (భర్తగల స్త్రీలకు) మేలిమి+ఐన=మంచివెలగలవి అయిన, మణుల సొమ్ములు = రత్నములతో చేయబడిన వస్తువులు, కంఠసూత్రము = మంగళసూత్రము. (పుస్త్రై.)

తా॥ భర్తగల స్త్రీలకు, మంచివెలగల రత్నములతో చేయబడిన సొమ్ములు ఉన్నను మంగళసూత్రము లేకున్నచో అవి దండుగయే. అట్లే విద్యావంతుడగువాడు తనవిద్యను ఇతరులకు బోధింపక పోయినచో పనికిమాలినవాడే నని భావము.

ఆ॥ వె॥ నిండు నదులుపారు । నిలచి గంభీరమై
వెఱ్ఱి వాగుపారు । వేగబొర్లి
అల్పుడాడురీతి । నధికుండు వాగునా ? ॥వి॥

టీ॥ గంభీరము+ఐ=దృఢముగలది అయి (తొణికసలాడకుండ) పారుఁ=ప్రవహించును, వెఱ్ఱివాగు=చిన్నకాలువ, పొర్లి=పొంగుచు, అల్పుడు=తెలివిహీనుడు, ఆడురీతిఁ=పలుకునట్లుగా, అధికుండు=తెలివిగలవాడు, వాగునా=బడాయిమాటలు పల్కడని భావము.

తా॥ తెలివిహీనుడు పల్కినట్లు బడాయిమాటలు, మంచి గుణములు కలవా డెన్నటికిని చెప్పడు. గలగల శబ్దముచే

యుచు పొంగిపొంగి పారు చిన్నచిన్న కాలువలవలె, పెద్దనదులు ప్రవహింపవుకదా !

ఆ॥ వె॥ కులములోన నొకడు । గుణహీనుడుండిన
కులము చెడును వాని । గుణమువలన
వెలయు చెఱకునందు । వెన్నువెడలినట్లు ॥వి॥

టీ॥ గుణహీనుడు = మూర్ఖుడు, వెలయు = వృద్ధిజెందు, వెన్ను=కంకి, వెడలినట్లు=బయలుదేరినట్లుగా, (పుట్టినట్లు).

తా॥ బాగుగా ఎదిగిన చెఱకునందు కంకి (వెన్ను) జనించి దాని తీపిని పాడుచేసినట్లుగా, నీచుడగు వాడు జనించి తనకే గాక వంశమునకుకూడ అపఖ్యాతి తెచ్చును.

ఆ॥ వె॥ ఎద్దుకయినగాని । ఏడాది తెలిపిన
మాట దెలిసి నడచు । మర్మ మెరిగి,
మొప్పె తెలియలేడు ముప్పదేండ్లకునైన ॥వి॥

టీ॥ ఏడాది = సంవత్సరము. మర్మము = రహస్యము, మొప్పె=నీచుడు.

తా॥ ఒక్కసంవత్సరము ఎద్దునకైనబోధించిన మనమాటలలో గల రహస్యము (అర్థము)ను తెలిసికొని చక్కగా నడచుకొనును-కాని, నీచుడగువానికి ముప్పది సంవత్సరములు నీతి బోధించినను గ్రహింపజాలడు.

ఆ॥ వె॥ పాముకన్న లేదు । పాపిష్ఠిజీవంబు,
అట్టిపాము చెప్పినట్లు । వినును,
ఖలునిగుణముమార్చ । ఘనులకు తరమౌనె॥వి॥

టీ॥ పాపిష్ఠిజీవంబు=నీచమయిన జీవితము, ఖలుడు= మూర్ఖుడు, మార్చన్=మరలించుటకు, ఘనులకు=ఎంత విద్య గలవానికైనను, తరమౌనె ?=వీలు ఉన్నదా ? (లేదని భావము)

తా॥ జన్మలన్నిటిలోను తెలివిహీనమైన జన్మ పాము యొక్క జన్మము. అట్టి పాము మనము చెప్పినట్లుగా వినుచున్నది. కాని, మూర్ఖుడగు మానవునికి మాత్రము చెప్పి, వాని గుణమును మరలించుటకు ఎంత గొప్పవారికిని శక్యము కాదు.

ఆ॥ వె॥ వేము పాలుబోసి । పెయ్యేండ్లు పెంచినఁ
చేదు పోయి, తీపి । రాదు తలప;
ఓగు నోగె గాక । ఉత్తముండెటు లౌను ॥వి॥

టీ॥ వేము=వేపచెట్టు, తలపఁ = ఆలోచింపగా, ఓగు= మూర్ఖుడు, ఓగె, మూర్ఖుడే, ఉత్తముడు = మంచిగుణములు గలవాడు.

తా॥ వేపచెట్టునకు ఎన్ని సంవత్సరములు పాలుపోసి పెంచినను, దానికిగల చేదు పోయి తీపిరాదు. అట్లే మూర్ఖుడు ఎన్నినీతులు విన్నను తన మూర్ఖత్వము మానడని భావము.

ఆ॥ వె॥ గొడ్డుటావు బిదుక । కుండ గొంపోయినఁ
పాలనీక తన్ను । పండ్లు రాల
లోభివాని నడుగ । లాభంబు లేదయా ॥వి॥

టీ॥ గొడ్డుటావున్=పాలునశించిన ఆవుదగ్గరకు, పిదుకన్= పిండుటకు, కొంపోయిన=తీసికొనివెళ్ళినచో, పాలన్=పాలును,

ఈకన్ = ఇవ్వకుండగ, పండ్లు=దంతములు, రాలన్ = ఊగునట్లుగా, లోభివానిన్=పిసినిగొట్టును (పీనారిని) అడుగన్=కోరగా, లాభంబు=ఫలితము (లేదు)

తా॥ పాలులేని ఆవుదగ్గరకుపోయి పాలు పిండబోయిన మూతిమీద తన్నునట్లుగా, దానము ఎరుగనివానిని ఆశింపబోయిన లాభము కలుగదు—పైగా కీడుకూడ సంభవింపగలదనిభావము.

ఆ॥ వె॥ ఆశచేత నరులు । ఆయువు కలనాళ్ళ
తిరుగుచుందురి భ్రమను । ద్రిప్పలేక
ముఱికి భాండమందు । ముసురు నీగలభంగి॥వి॥

టీ॥ ఆశచేతన్ = కోరికలవలన, అయువు=జీవము, కలనాళ్ళన్= ఉన్నదినములయందు, భ్రమను= ఆశను, త్రిప్పలేక= మానుకొనలేక, ముఱికిభాండమందున్ = మలినమగు కుండమీదను, ముసురు=వ్రాలు, ఈగలభంగిన్=ఈగల రీతిగా.

తా॥ ముఱికికుండపై ఈగలుమూగి ఆశతో తిరుగునట్లు, మనుష్యులు ప్రాణము ఉన్నన్ని దినములు కోరికలను మానుకొనలేక దురాశాపరులు అగుచుందురు.

ఆ॥ వె॥ ఆశ పాపజాతి । అన్నిటికంటెను
ఆశ వలన కీర్తి । అంతరించు
ఆశ విడచువాడె ఆనందమును బొందు ॥వి॥ 73

టీ॥ ఆశ = దురాశ, (పాపపుకోరిక), పాపజాతి=చాల పాపముకలిగించునది, కీర్తి=గొప్పదనము, అంతరించున్=నశించును, ఆనందమును=సంతోషమును, పొందున్=అనుభవించును.

తా॥ దురాశ మిక్కిలి పాపము కలది. దానివలన గౌర వము నశించును. ఆశను విడిచినవాడు సంతోషమునుపొందును.

ఆ॥ వె॥ అలను బుగ్గపుట్టి । అప్పుడే క్షయమౌను
కలనుగాంచు లక్ష్మి । కనగరాదు
ఇలను భోగభాగ్య। మీతీరు తలపోయ ॥వి॥ 74

టీ॥ అల=తరంగము, బుగ్గ=బుడగ. క్షయము + అవును= నశించును, కలనుగాంచు=స్వప్నములో చూచిన, లక్ష్మి=సంపద, కనగరాదు = కనబడుటలేదు, ఇలను = ప్రపంచములో, భోగ భాగ్యము=సంపదయొక్క ఆనందము, తలపోయగా=ఆలోచిం పగా, ఈతిరె=ఇంతియె.

తా॥ నీటిలోబుట్టు బుడగ అప్పుడే నశించుచున్నది. కలలో గనిపించు సంపద మెలకువవచ్చిన కనబడుటలేదు. అట్లే సంపదయొక్క ఆనందమును నిలుచునది కాదని అర్థము.

ఆ॥ వె॥ కోతినొనరదెచ్చి । కొత్తపుట్టము గట్టి
కొండ్రముచ్చులెల్ల । కొలిచినట్లు
నీతిహీనుచెంత । నిర్భాగ్యులుందురు ॥వి॥ 75

టీ॥ ఒనరగ=బాగుగా, కొత్తపుట్టము=క్రొత్తబట్టను, కొలిచి నట్లు=సేవించినట్లుగా, నిర్భాగ్యులు=దరిద్రులు.

తా॥ తెలివిలేనివగు కోతులదగ్గర, పనికిమాలిన కొండ ముచ్చులు చేరి సేవించినట్లుగా—తెలివిహీనునిదగ్గరకు పోయి దరిద్రుడు నివసించును.

ఆ॥ వె॥ మైలకోకతోడ । మాసిన తలతోడ
ఒడలు ముఱికితోడ । ఉండెనేని
అగ్రకులజుడైన అట్టిట్టు పిల్తురు ॥వి॥ 76

టీ॥ మైలకోకతోడన్=మాసిన బట్టతోడను, ఒడలు=శరీరము, అగ్రకులజుడు + ఐనన్ = బ్రాహ్మణుడు అయినను, అట్టిట్టు=మర్యాదలేకుండగా.

తా॥ మాసినబట్టలు ధరించి, తల దువ్వుకొనక, శరీరమంతయును ముఱికిచే ఉండగా నడచువాడు బ్రాహ్మణుడైనను, తగిన గౌరవమును పొందలేడు. (పరిశుభ్రముగా ఉండవలెనని భావము)

ఆ॥ వె॥ పట్టు పట్టరాదు । పట్టిన విడరాదు
పట్టెనేని బిగియ । పట్టవలెను
పట్టి విడుటకన్న । గిట్టుటయే లెస్స ॥వి॥ 77

టీ॥ పట్టు=పట్టుదలను, పట్టరాదు=పూనవలదు, పట్టినన్=ప్రయత్నించినచో, విడరాదు = విడువకూడదు. పట్టి=ప్రయత్నించి, గిట్టుటయే=మరణించుటయే, లెస్స=మంచిది.

తా॥ ఆలోచింపక ఏకార్యమును తలపెట్టరాదు. తలపెటినచో విడివరాదు. తలపెట్టినపనికి తగిన సాధనము చూచుకొని ఆకార్యము నెరవేర్చుకొనవలెను కాని, ఆపని ప్రారంభించి విడిచిపెట్టుటకంటె మరణించుట చాల మంచిది.

ఆ॥ వె॥ ఇనుము విరిగెనేని । ఇనుమారు ముమ్మారు
కాచి యతుకవచ్చు । క్రమముగాను
మనసు విరిగెనేని । మరల చేర్చగరాదు ॥వి॥

టీ॥ విరిగెనేనిన్ = ముక్కలు అయినచో, ఇనుమారు= రెండుసార్లు, ముమ్మారు=మూడుసార్లు, చేర్చగన్=సరిచేయుటకు, రాదు=వీలుపడదు.

తా॥ ఇనుము ముక్కలయినచో రెండు మూడు సార్లు అయిన కాల్చి దానిని అతికించవచ్చును. కాని, మనస్సు చెదిరి పోయినచో అది మరల యథారీతిగా చక్కజేయుట సాధ్యము కానిపని.

ఆ॥ వె॥ అనగ ననగరాగ । మతిశయిల్లుచు నుండు
తినగ తినగ వేము। తియ్యనుండు
సాధనమున పనులు । సమకూరు ధరలోన ॥వి॥

టీ॥ రాగము=పాట, అనగన్ + అనగన్=పాడగా పాడగా, అతిశయిల్లుచున్=పెంపుచెందుచు, ఉండున్=ఉండును, వేము= వేపపువ్వు, సాధనమునన్ = ప్రయత్నమువలన, సమకూరున్= నెరవేరును.

తా॥ నిత్యము పాటపాడుచుండిన అది వృద్ధికి వచ్చును. వేపపువ్వును నిత్యము తినుచుండిన అది చేదుగానున్నట్లుగాక, తియ్యగానే ఉండును. అట్లే ఎట్టికష్టమైన పనులు అయినను చేయగా చేయగా అవి తేలికగానే అగుచుండును.

ఆ॥ వె॥ కానివానిచేత । కాసుల నిడి, వాని
వెంట దిరుగువాడు । వెఱ్ఱివాడు
పిల్లితిన్నకోడి । బిలిచిన పలుకునా ? ॥వి॥ 80

టీ॥ కాని వానిచేతన్ = తెలివిహీనునిచేతిలో, కాసులన్= ధనమును, ఇడి=ఉంచి, వెఱ్ఱివాడు=తెలివిహీనుడు.

తా॥ మూర్ఖుడగువానికి ధనమును (అప్పు లేక దాచుటకు) ఇచ్చి, మరల దానికొఱకు వానిచుట్టును తిరుగుచుండెడు వాడు చాల తెలివి తక్కువవాడు.

ఆ॥ వె॥ కర్మ మధికమయిన । గడచిపోవగరాదు
ధర్మరాజు దెచ్చి । తగనిచోట
కంకుభట్లజేసె । కటకటాదైవంబు ॥వి॥ 81

టీ॥ అధికము=ఎక్కువ, గడచిపోవగరాదు = తప్పుకొన లేము, తగనిచోటు=ఉండగూడనిస్థలము, కటకటా=అయ్యయ్యో.

తా॥ కర్మముఁ (శనిప్రభావము) ఎక్కువగా బాధించు చుండ దానినుండి తప్పుకొన ఎవరికిని శక్యముకాదు. ధర్మరాజు వంటి మహానుభావుడు కూడ శనిప్రభావముచేతనే కంకంభట్టు అను పేరుతో తనకన్న అన్నివిధముల తక్కువవాడగు విరాట రాజును సేవించవలసివచ్చెను.

ఆ॥ వె॥ కుక్క గోవుకాదు । కుందేలు పులికాదు,
దోమ గజముకాదు । దొడ్డదైన
లోభి దాత కాడు । లోకంబు లోపల ॥వి॥ 82

టీ॥ లోకంబులోపలఞ = ప్రపంచములో గోవు = అవు, కుందేలు=చెవులపిల్లి, గజము=ఏనుగు, దొడ్డది + ఐన=గొప్పది అయినను. లోభి=పీనారి, దాత=దానవంతుడు; ధర్మాత్ముడు.

తా॥ కుక్క ఎన్నటికిని అవుకాజాలదు. కుందేలు పులికాదు. దోమ ఏనుగు అవదు. అట్లే పిసినిగొట్టు దానవంతుడు కాడని భావము.

ఆ॥ వె॥ లక్ష్మి వెలసినట్టి । లంకేశునగరంబు
బిల్లకోతిరాజు । కొల్లగొట్టె
చేటుకాలమైన । చెఱుప నల్పులుచాలు ॥వి॥ 83

టీ॥ లక్ష్మిఞ=సంపదతో, వెలసినట్టి=ప్రకాశించినటువంటి, లంకేశునగరంబునఞ=లంక అను పట్టణమును, పిల్లకోతిపాజు= చిన్నచిన్నకోతులయొక్క గుంపులు, కొల్లగొట్టె=పాడుచేసెను, చేటుకాలము + ఐన=చెడ్డకాలము వచ్చిన సమయములో, చెఱుపఞ=పాడుచేయుటకు, అల్పులు=తక్కువ జాతివారు.

తా॥ సిరిసంపదలతో తులదూగు లంకానగరముయొక్క వైభవమును కోతుల మూలమున నశించెను. చెడుకాలము వచ్చినచో తక్కువ వారివలనకూడ అపద సంభవించును.

ఆ॥ వె॥ ఇచ్చువానివద్ద । ఈయని వాడున్న
జచ్చుగాని ఈవి । సాగనీడు
కల్పతరువుక్రింద । గచ్చపొదున్నట్లు ॥వి॥ 84

టీ॥ ఈవి = దానము, సాగనీడు = చేయనీయడు, కల్ప తరువు=కోరికలను తీర్చెడువృక్షము.

తా॥ తలంచినవెంటనే కోరికలనెల్ల తీర్చు కల్పవృక్షము దగ్గరకు రానీయకుండ గచ్చపొద బయలుదేరినట్లు, దానము చేయువానివద్ద లోభి ఉండిన దానము నొసంగనీయడు.

ఆ॥ వె॥ అరయ నాస్తియనక । అడ్డుమాటాడక
తట్టుపడక మదిని । దన్నుకోక,
తనది కాదనుకొని । తా బెట్టునదెపెట్టు ॥వి॥ 85

టీ॥ అరయఁ=చూడగా, నాస్తి=లేదు, అడ్డుమాట=ఎదురు పలుకు, తట్టుపడకఁ=నిందలు చెందకుండగా, మదిని దన్నుకొనకఁ=మనస్సువిచారింపకుండ, తాఁ=తాను, పెట్టునదె=ఒకరి కింత ఇచ్చునదే, పెట్టు=ఇచ్చుట.

తా॥ ఒకరికి దానము యిచ్చునప్పుడు మనస్సులో విచారింపకుండగా, సంతోషముగా ఈయవలెను. దానివలననే ఫలితము కలుగును. మనస్సులో కుందుచు పైకి దానము సల్పుట మంచిదికాదని భావము.

ఆ॥ వె॥ కొంకణంబుపోవ । కుక్క సింహము కాదు
కాశి కరుగ పంది । గజముకాదు
~~వేరు జాతివాడు విప్రుండు~~ । కాలేడు ॥వి॥ 86

టీ॥ కొంకణంబు = కొంకణదేశము, అరుగఁ = పోవగా, విప్రుడు=బ్రాహ్మణుడు, గజము=ఏనుగు.

తా॥ కొంకణదేశము వెడలినను కుక్క సింహము కాజా లదు. మహాపుణ్యక్షేత్రమగు కాశీనగరమునకు వెళ్ళినను పంది ఏనుగు కాదు. అట్లే ఎంత కష్టపడినను ఇతరకుటుంబములో పుట్టినవాడు బ్రాహ్మణుడు కాజాలడు.

ఆ॥ వె॥ పొట్లకాయకొక్క । పొడుగు త్రాటను ఱాయి
కట్టగాను వంక । గాక పెరుగు;
కుక్కతోక గట్ట । చక్కగా వచ్చునా ॥వి॥ 87

టీ॥ వంకగాకఁ=వంకరలేకుండగా, పెరుగున్=పెరుగును.

తా॥ పొట్లకాయకు ఒకరాయిని కట్టినచో అది వంకర లేకుండగా పొడుగుగా పెరుగును. కాని, కుక్కతోకకు అట్లే రాయికట్టి ఎన్నిదినాలు ఉంచినా దాని వంకరపోదు-(మంచి వానికి నీతి బోధించిన విని, సుఖించుననియు, చెడ్డనడతగలవా నికి ఎన్నినీతులు చెప్పినను తననడవడిక మానడనియు భావము)

ఆ॥ వె॥ విభున కిచ్చునట్లు । పేదల కీయరు;
వనిత కిచ్చునట్లు । వడుగు కీరు;
సురకు నిచ్చునట్లు । సుమతుల కీయరు ॥వి॥

టీ॥ విభునకున్ = రాజుకి, పేదలకుఁ = బీదవారలకు, ఈయరు=ఇవ్వలేరు, వనితకుఁ=స్త్రీకి (వేశ్యకు), వడుగుకున్= బ్రాహ్మణునకు, ఈరు=ఇవ్వరు, సురకు=కల్లుకు, సుమతుల కుఁ=మంచిగుణములు గలవారికి.

తా॥ రాజునకు ఇచ్చునట్లుగా దరిద్రునకు ఇచ్చుటకు

మనస్సు ఒప్పదు. వేశ్యలకు ఇచ్చునట్లు బ్రాహ్మణులకు ఇవ్వరు. కల్లుకు ఉపయోగించునట్లు మంచివారికి ఉపయోగపడునట్లు ధనము ఖర్చుచేయరు.

ఆ॥ వె॥ ఆడదానిబొంకు । గోడకట్టినయట్లె
ధరణి నరునిమాట। తడకరీతి;
స్త్రీల మాయ దెలియ। జాలడీశ్వరుడైన॥వి॥ 89

టీ॥ బొంకు=అబద్ధము, ధరణిఁ = లోకములో, నరుని మాట=పురుషులమాట, ఈశ్వరుడైనన్=భగవంతుడయినను.

తా॥ గోడ ఎంత బలము కలదిగా నుండునో అంతబలము కలదిగా ఆడవాళ్ళు పలికిన అబద్ధములు ఉండును. తడక రీతిగా అనగా బలములేనిదిగా (నమ్మకములేనిదిగా) మగవాని మాట ఉండును. ఆడవాళ్ళయొక్క మాయమాటలు తెలిసి కొనుటకు భగవంతునికిగూడ తరముకాదు.

ఆ॥ వె॥ అల్లుడైనగాని । అన్యుడైనను గాని
చెప్పవలయు నీతి । ఒప్పుగాను;
హరునియాన లేక । ఆకు లల్లాడునా? ॥వి॥ 90

టీ॥ అన్యుడు=ఇతరుడు, ఒప్పు=అందము, హరునియాన= ఈశ్వరుని యనుమతి, అల్లాడునా?=కదలునా? (కదలవు.)

తా॥ తనకు మిక్కిలి బంధువు (అల్లుడు) అయినను, ఇతరులయినను సరే మంచిగుణములు చెప్పవలయును. వారు విని చక్కగా నడుచుకొందురు. ఆకులుకూడ ఈశ్వరుడు చెప్పినట్లుగానే వినుచున్నవి. (ఒకరుచెప్పిననీతిని వినవలెనని భావము)

ఆ॥ వె॥ దాతలేని గృహము । దయ్యాల కొంపరా
నీతిలేనివ్రాత । వ్రాతచేటు;
ప్రీతిలేని పడతి । భూతమై తోచురా ॥వి॥ 91

టీ॥ దాత=ధర్మాత్ముడు, గృహము=ఇల్లు, కొంప=ఇల్లు, చేటు=నిరర్థకము (నాశము), ప్రీతి = ప్రేమ, పడతి=ఆడుది (భార్య) భూతము=దయ్యము, తోచున్=అనిపించును.

తా॥ ధర్మాత్ముడు లేని యిల్లు దయ్యములు ఉన్న ఇల్లుతో సమానము. నీతి కనబడని పుస్తకములు వ్రాయుట మంచిది కాదు. ప్రేమలేని భార్య, దయ్యముతో సమానము,

ఆ॥ వె॥ తల్లి కెదురుకొంట । తండ్రి కెదురుకొంట
అన్న కెదురుకొంట । అరయ మూడు
పాతకముల నెఱిగి । వర్తింపగావలె ॥వి॥ 92

టీ॥ అరయన్=చూడగా, ఎదురుకొంటన్=ఎదురుపల్కుట పాతకములన్ = పాపములను, ఎఱిగి=తెలిసికొని, వర్తింపగా వలెను=సంచరింపవలెను.

తా॥ తల్లి, తండ్రి, అన్న-వీరియొక్క మాటలను విని నడువవలెనుగాని వారిని ఎదిరించి, తిట్టి కొట్టి, మూర్ఖుడు కాగూడదు. ఆ ముగ్గురిని తూలనాడుట యను మూడు పాపములను తెలిసికొనువాడే నిజమగు మానవుడు.

ఆ॥ వె॥ మాట దిద్దవచ్చు । మరియెగ్గు లేకుండ
దిద్దవచ్చురాయి । తిన్నగాను
మనసు దిద్దరాదు । మహి నెంతవారికి ॥వి॥ 93

టీ॥ మహిన్=ప్రపంచములో, ఎంతవారికిన్=ఎంత గొప్ప

వారికి అయినను. ఎగ్గు=నష్టము.

తా॥ ప్రపంచములో ఎంత జ్ఞానము ఉన్నవారికైనను దుష్టులయొక్క మనస్సును మంచిమార్గములోనికి తీసికొని రాలేదని భావము.

ఆ॥ వె॥ పుడమి దిరిగిపడయు । పుణ్యంబు లెల్లను
కలుగు సాధువులను । గనిన ముక్తి
వేడినీరు పడియబడి । తేట యైనట్లు ॥వి॥ 94

టీ॥ పుడమిన్=భూమిని (లోకంలో ఉన్న అన్ని పుణ్య క్షేత్రములకును) పడయున్=పొందును, సాధువులను=మంచి గుణములు కలవారు, కనినన్ = చూచినయెడల, ముక్తి= మోక్షము, పుణ్యము, కలుగున్=దొరుకును పడియబడ=పడ పోత కావింపబడి, తేటయైనట్లు=పరిశుభ్రముగా అయినట్లుగా.

తా॥ వేడినీరు పడపోత అయినపిమ్మట తేటనీరు అయినట్లుగా, (నరుడు) ప్రపంచములోగల పుణ్యక్షేత్రములు తిరిగి చూచుటవలనను, మంచిగుణములు గలవారిని సేవించినందు వలనను పుణ్యము లభించును.

ఆ॥ వె॥ ఎన్నిచోట్లు తిరిగి । ఎంత శ్రమించినన్
అంటనీదు శనియు । వెంట నున్న
భూమిక్రొత్తదైన। భుక్తులు క్రొత్తలా ॥వి॥ 95

టీ॥ చోట్లు=స్థలములు, శ్రమించినన్=బాధ చెందినను, అంటనీదు=దొరుకునట్లుగ చేయదు, భుక్తులు=ఆహారములు.

తా॥ మానవునకు శని యున్నదినములలో ఎన్ని బాధలు పడినను, ఎన్ని స్థలములకు దిరిగినను దొరికే వస్తువుకూడ దొరుకదని భావము.

ఆ॥ వె॥ విత్తము గలవాని । వీపున పుండైన
వసుధలోన చాల । వార్త కెక్కు
పెదవానియింట । పెండ్లైన నెరుగరు ॥వి॥ 96

టీ॥ విత్తము=ధనము, వసుధ=ప్రపంచము, పేదవాడు = దరిద్రుడు.

తా॥ ధనముగలవానికి వీపుమీద కురుపువేసినను, ఆసంగతి చాలమందికి తెలియునుగాని, దరిద్రుని యింటిలో పెండ్లి అయినను ప్రక్కనున్నవారికికూడ తెలియదు. (దరిద్రుని ఎవరును గౌరవింపరు)

ఆ॥ వె॥ ఆలిమాటలు విని । అన్నదమ్ముల బాసి
వేరు బోవువాడు । వెఱ్ఱివాడు
కుక్క తోక బట్టి । గోదావరీదునా ? ॥వి॥ 97

టీ॥ ఆలి = భార్య, బాసి=విడిపోయి, వేరుపోవువాడు= ఇంకొక కాపురము పెట్టినవాడు.

తా॥ కుక్కతోకనుపట్టుకొని గోదావరినదిని ఎట్లు దాటుటకు కష్టపడునో, అట్లే భార్యమాటలను ఆలకించి ఇంకొక కాపురము పెట్టినవాడు బాధ చెందగలడు.

ఆ॥ వె॥ చెప్పులోని ఱాయి । చెవులోని జోరీగ
కంటియందు నలుసు । కాలిముల్లు
ఇంటిలోన పోరు । ఇంతింత యనలేము ॥వి॥

టీ॥ జోరీగ = ధ్వనితోతిరుగు ఈగ; కందిరీగ, నలుసు= నలక, పోరు=జగడము, ఇంతింత=ఇంత అంత (శక్యముకానిది)

తా॥ చెప్పులో రాయిపడినను, చెవిలో కందిరీగ దూరినను, కంటిలో నలక పడినను, కాలికి ముల్లు గుచ్చుకొనినను-ఎంత బాధగా ఉండునో అంతకు ఎక్కువ బాధ ఇంటియందు జగడము లుండినయెడల పొందునని భావము.

ఆ॥ వె॥ మృగము మృగమటంచు। మృగముల దూషింత్రు
మృగముకంటె చెడిపె । జగతి నరుడు,
మృగము నీతి నరున । కించుకయునులేదు ॥వి॥

టీ॥ మృగము=పశువు, దూషింత్రు=నిందించెదరు, జగతిన్=లోకములో, చెడిపె=మూర్ఖుడు, నరునకు=మనుజునకు, ఇంచుకయును=కొంచెము అయినను.

ఆ॥ వె॥ వేయి విధము లమరు । వేమనపద్యముల్
అర్థమిచ్చు వాని । నరయగాను;
చూడ జూడ గలుగు । చోద్యమౌ జ్ఞానంబు
విశ్వదాభిరామ ! । వినుర వేమా ! 100

టీ॥ వేమనపద్యముల్=వేమనకవి చెప్పిన పద్యములు, వేయి విధములన్ = ఎన్నోరీతులుగా, అరయగాను = చూడగా, అమరున్=ఉండును. చోద్యమౌ=ఆశ్చర్యమును కలిగించునట్టి.

తా॥ వేమనమహాకవి చెప్పిన పదములలోగల నీతి, ఎన్ని విధములుగానో అర్థము అగుచుండెను. వానిని బాగుగా నేర్చుకొనిన అద్భుతమగు జ్ఞానమును కలుగును. (ప్రతి పద్యమును బాగుగా బాలురు అభ్యసింపవలెనని భావము.)

**టీకవేమనశతకము**

**సంపూర్ణమ్ !**